యుండుటంబట్టి వృక్షసంపత్తి విశేషముగా నుండును. అందువలనే దక్షిణహిందూస్థానమునందు వనము లనేకము లుండెను.

క. 'ప్రతినగరంబు వనమ్ములు
ప్రతివనమును బూగతరులు పాకోన్ముఖముల్
ప్రతిపూగంబు సుమమ్ములు
ప్రతిసుమమును మధురసంబు, బరగెడు నిచటన్'.

—తెలుగు విశ్వగుణాదర్శము.

అట్టివనములనే ఆర్యులు పితృవనములని పిలచిరి. లయకర్తయగు రుద్రునికి ఆదేశమును నిర్దేశించిరి. ద్రావిడులే ఆర్యసంతతికి జేరినవారయిన తమ నివాసస్థానమును శ్మశానమునకు బోల్చికొనరుగదా! ద్రావిడులు మరమ్మను = మారెమ్మను = చెట్టుతల్లిని భయభక్తులతో బూజింతురు. తమ్మ కాపాడు కాటప్పకు నోములు జేయుదురు. తమజాతి యాడవాండ్రకు మగవాండ్రకు మారెమ్మ, కాడమ్మ, కాళమ్మ, కాడప్ప, కాటప్ప, యను పేరులను బెట్టుదురు. కట్టెపనిజేయు కమ్మరివారి యందీపేళ్లు చాల కనబడుచున్నవి. వారే మారెమ్మ అర్చకులుగా నున్నారు. ఇట్టి నామకరణ మార్యులందు జూపట్టదు. శైవము బహుకాలమునుండి దక్షిణహిందూస్థానమునం దుండినను అయ్యది వనదేవతాపూజకు జాలవచ్చినమతము. శైవము ఆర్యపితృయానాసమ్మిశ్రితము. లేకున్న ద్రావిడులు తమ శైవమతమునందు విష్ణుపాదోద్భూతయైన గంగను శివుని తలకెక్కించి యుండరు. విష్ణుని మూడవయడుగు అధోలోకమున నుండుటం బట్టి దానినుండి బుట్టిన గంగ వారి యిష్టానుసారముగా శివుని శిరోభూషణము జేయబడియున్నది. మితిమీరిన ప్రతాపముగల ఉష్ణమండలపు సూర్యున్నేమి శీతకరుడగు చందురుడేమి, సమానముగా నప్రియములే. వానిని వారు, లయకర్తగా నియమింపబడిన శివుని మూడుకన్నులుగా జెప్పిరి. శివుని దిగంబరుడనియు, వనవాసియనియు, చర్మవసనుడనియు, శబరరూపుడనియు బల్కిరి. ఇవి యన్నియు వన్యనిలయముగల యుష్ణమండలమువారి ప్రియాప్రియములను జీవనవృత్తులనుబట్టి పొందించినవి ఇవి యార్యేతరలక్షణములని యొప్పికొనక తప్పదు. పగటిని మూడుభాగములుగా జేసి ఆర్యులు వానికి ముగ్గురధిదేవతలని జెప్పిరి. ప్రాతఃకాలమున సూర్యుడు బ్రహ్మరూపియనియు, మధ్యాహ్నమున రుద్రరూపియనియు సాయంసమయమున విష్ణురూపియనియు వాక్రుచ్చిరి. ఇందు సృష్టి, స్థితి, లయములు క్రమముగా జెప్పబడలేదు. మధ్యనుండుస్థితి కొనకుబోయినది. కొననుండదగుకర్త మధ్యస్థానమునకు వచ్చినాడు. మధ్యందినమార్తాండుడుగా రుద్రుడు జెప్పబడినాడు. ఇయ్యది యోర్వరాని వేడిమిగల సూర్యునుండు ఉష్ణమండలమునకే అన్వయించునుగాని తదితరప్రదేశములకు గాదు. వైష్ణవులు శివుని విష్ణుమనుమనిగా జేసి యతనికి పితృవనాధిపత్యమునిచ్చి యతనిని విష్ణుపాదోదకము ధరింపజేసి వీరవైష్ణవునిగా వర్ణించిరి. శైవులు శివుడు బ్రహ్మశిరస్సును దునిమెననియు, మన్మథుని దహించెననియు నరసింహముతో శరభుడై పోరాడెననియు ననేకక్షుద్రకథలను ప్రతీకారబుద్ధినిబట్టి ప్రారంభించిరి. మొత్తమున శివవైష్ణవమతకలహములందుండు విరుద్ధోక్తులే ద్రావిడులకును ఆర్యులకు నుండిన విరోధమును జాత్యభిమానములను చూపించుచున్నవి. ఇదియు ద్రావిడు లార్యేతరులనుదానిం దెలుపుచున్నది. ఈ రెండు జాతులవారు తమతమ దైవములకు లక్షణనామముల నిచ్చుటలోనే తమ ప్రత్యేకతను భేదభావమును జూపించినారు.

ఇందుకు నిదర్శనము:—

| విష్ణువు | శివుడు |
|---|---|
| చక్రపాణి | ఖండపరశు |
| విశ్వంభర | విశ్వనాథ |
| వైకుంఠుడు | గిరీశుడు |
| పీతాంబరుడు | కృత్తివాసుడు |
| శార్ఙ్గి | పినాకి |
| వనమాలి | రుండమాలి |
| బలిధ్వంసి | క్రతుధ్వంసి |
| గరుడధ్వజ | వృషధ్వజ |
| పుండరీకాక్ష | విరూపాక్ష |
| జనార్దన | హర |
| త్రివిక్రమ | త్రిపురాంతక |

| | |
|---|---|
| గంగాజనక | గంగాధర |
| హృషీకేశ | వ్యోమకేశ |
| అచ్యుత | స్థాణు |
| శ్రీపతి | ఉమాపతి |

ఇట్లు పేరులపేరులు గట్టి 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' యని పందెమువేసికొని పాటుబడినారు. వీనినుండి యొక గొప్పఫలము గలిగినది. ఆర్యులు తమదేవుని కిచ్చిన పరివారనామప్రదేశములనుబట్టి వారు ద్వీపవాసులనియు ద్రావిడులు తమదేవత కిచ్చిన పరివారనామప్రదేశములను బట్టి పర్వతప్రదేశనివాసులనియు చక్కగ దెలియుచున్నది. మఱియు వేడిమి వల్ల బాలిన ద్రావిడులను ఆర్యులు రాక్షసులనిరి. వారివలన దాక్షిణాత్యులనుపదము రాక్షసపర్యాయపద మైపోయినది. రాక్షసులకు నలుపువన్నె వర్ణింపబడినది. ద్రావిడులే ఆర్యులైన తమ్ము తామట్లు గేలి చేసికొందురా? వైష్ణవమతసంభవము ఉత్తరలోకములతోను శైవమతసంబంధము దక్షిణలోకములతోను సంబంధముగలవి యని స్థూలముగా జెప్పవచ్చును. ద్వీపవాసులగు ఆర్యులు అనంతాసనము, శ్వేతద్వీపము మొదలగువానినే విష్ణునివాసస్థానములుగా జెప్పుటయు, విష్ణువును సాగరశయనునిగా వర్ణించుటయు, సంసారమును సాగరమునకు బోల్చుటయు ద్వీపవాసులదేవజీవనాభిప్రాయములని కాన్పించుచున్నవి. (Island dweller's conc eption of god and life) శివుని వనవాసిగను, వనచరుడుగను, ఖండపరశుగను, భూతపతిగను, చర్మధారిగను, సారంగధరుడుగను, గిరీశుడుగను, గిరిజాపతిగను, నాగభూషణుడుగను, గజారిగను, నందిధ్వజుడుగను వర్ణించియుండుటయు, సంసారమును ఘోరాటవికి పోల్చుటయు వనప్రదేశవాసుల దేవజీవనాభిప్రాయములను సూచించుచున్నవి (Land dweller's conception of god and life). ఒక్కమాటలో ఆర్యద్రావిడుల మతసంప్రదాయములను జెప్పవలయునన్న నయ్యవి క్రమముగా ద్వీపవనసంబంధములవలన గలిగినవి అనిన చాలును (Islandish and landish conceptions). మానవజాతి కతిప్రీతిగానుండు మతము నందే యిట్టి ఘనభేదము కన్పట్టిన ద్రావిడులు ఆర్యులు ప్రత్యేకజాతి వారని జెప్పుట కెట్టి సందేహము నుండదు. సంఘము గాలివానలకు చలికేదుములకు తాళజాలక తొలుత జనులు గవి గళు=పర్వతగుహాలయందును గుడిగుండార=తాళ్ల చేరికలయందును కప్పులయందును నివసించియుండుట ప్రకృతిధర్మము. అట్టిసమయములందు సంఘమువారు క్రూరమృగముల బాధనుండి కాపాడికొనుటకై గుంపులుగా జీవించియుండు టావశ్యకము. అట్టి గుంపులకు నాయకు డొక డుండును. అతడే గణపతి, వినాయకుడు. వన్యవైచిత్ర్యమున పొడమిన యద్భుతాశ్చర్యములనుండి కార్తేయమతము బుట్టినట్లు, వనాంతరపశుసంపత్తిని సంభవించిన విస్మయుంబునుండి పాశుపతము బుట్టినట్లు జనవర్గముల నాయకత్వమునుండి గాణాపత్యము బుట్టియుండును. శైవవైష్ణవజైనమతములు తరువాత వచ్చినవి. గాణాపత్యము కొడగుదేశమునందు చాలప్రసిద్ధము. పేరుపెట్టుటయందు అందలి జనులు గణపతిపదమునే విశేషముగా నుపయోగింతురు. గణపతి ఆహారవిహారములందు తనగుంపునకు మేటియై ముందు బంటుగానుండు. ఆహారాన్వేషణమునందు వారు పులులతోను సింహములు మొదలగు హింస్రమృగములతోను పోరాడవలసియుండును. అందుకే వారు శస్త్రాస్త్రనిపుణులుగా కావలసివచ్చెను. కన్నడిగలందు తుళువారు=బల్లవరు అట్టివారు. ఉష్ణమండలములో నగప్రదేశమున నాగములు పెక్కులుండును. కొండచిలువలకును త్రాచుపాములకును జనులు మిగుల భయపడుచుండిరి. ఆకారణమునుబట్టి ద్రావిడులయం దిప్పటికిని నాగారాధనము భయభక్తులతో జేయబడుచున్నది. పామునోము ద్రావిడులకు ప్రధానమైనది. ఆనోము జేసినవారికి కంటికి రాదందురు. దుర్గమవన్యప్రదేశములందు పాములు వారికంటబడవని దానియర్థము. శీతదేశములందలి పాములవలెగాక ఉష్ణమండలపు పాములు మారకములు. వీనివిషము అనివార్యము. అందుకే ద్రావిడులు అంతభయపడి పాములకు నోములుజేయసాగిరి. ఈయాచారమునే, ఆర్యులు దక్షిణమునకువచ్చి ద్రావిడులతో సంబంధములు కల్పించుకొన్న తరువాత దానిని "అనంతవ్రతము"గా మార్చిరి. పాముకఱచినపుడు విషము దింపుటకై ద్రావిడులు

తమ వనదేవతారూపమైన, మఱియు చేదుగలిగిన వేపాకుల నుపయోగించిరి ఇప్పటికిని విషమును దింపుటకును విషక్రిములను సంహరించుటకును వ్యాధిభూతవేదనలను నివారించుటకును ద్రావిడులు వేపాకులను వాడుచున్నారు. వనలక్ష్మీవ్రతమునో వరలక్ష్మీవ్రతమునో ఆర్యులు వరలక్ష్మీవ్రతముగా మార్చియుందురు. వటసావిత్రీవ్రతము నిట్టి మూలముగలదియే యగు. వ్రతము లన్నియు గణపతి పూజతో ప్రారంభ మగుచున్నవి. తరువాత పవిత్రజలములు పూజింపబడుచున్నవి ఇష్టదేవతావ్రతము నదీతీరములందును వనాంతరములయందును కావలయు నను ఆచారము విధింపబడినది. గణపతిపూజ, జలపూజ, వన్య పూజాస్థానము ఇవి యన్నియు నార్యేతరులనివాసమగు సంప్రదాయములను స్పష్టముగా నిరూపించుచున్నవి. అనేకవ్రతములు స్కాందపురాణమందే దొరకుచున్నవి. స్కాందము శైవపురాణము. ద్రావిడులు శైవమతాసక్తి గలవారు. ఈ కారణములనుబట్టి ద్రావిడులు ఆర్యజాతివారు గారు. ద్రావిడులకు వేదగ్రంథములు లేవు.

గీ. వేదవైదికకర్మవిద్వేషమూని
తలను భస్మవిలేపనధూసరితులు
లింగసంగతవక్షస్థలీవిషములు
చండరూపులుగలరు పాషండు లిచట.

—తెలుగు విశ్వగుణాదర్శము.

ఇది దాక్షిణాత్యులను గుఱించి చెప్పిన ఆర్యుని యభిప్రాయము. ధ్రువమండలనివాసమును వదలివచ్చిన యార్యులు మతాభిమానమును విడువక తమ వేదగ్రంథములను వ్రాసియుంచికొనిరి. ద్రావిడులు ఆర్యసంతతివారైన వారి వేదములును వేదాభిమానమును ఎక్కడ? వా రార్యజాతివారుగాని యీరెండును వారియందు గన్పట్టవు. ఆర్యులందుండు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులు ద్రావిడులందు లేవు. వృత్తులనుబట్టి బయలాసెనివింది కులము లున్నవి. గోత్రర్షులు ద్రావిడులకు లేరు. మఱియు నుత్తరహిందుస్థానమందలి యార్యులు సౌరమానమును బట్టి కాలమును లెక్కించుచున్నారు. దక్షిణహిందూస్థాననివాసులగు ద్రావిడులు చాంద్రమానమును బట్టి కాలమును లెక్కించుచున్నారు. ఇవియుగూడ ద్రావిడులు ఆర్యేతరులని తెలుపుచున్నవి. ఇవి గాక, భాషాపదములును, వ్యాకరణఛందోలంకారములును ద్రావిడు లార్యేతరులని నిర్ణయించుచున్నవి. ఈ విషయము సాహిత్యమును గుఱించి వ్రాయుచోట విస్తరముగా తెలుపబడును. ఇప్పుడుండు ఇన్ని ప్రబలకారణములను బట్టి మనము ద్రావిడులను ఆర్యేతరులనియే యందుము. ఆర్యశబ్దము గౌరవవాచకముగా ప్రయోగింపబడుటంజేసి ద్రావిడులను అనార్యులను పదముతో పిల్చుట అనుచితముగను అసభ్యముగను ఉండును. గనుక ద్రావిడులను ఆర్యేతరు లందము. కన్నడిగలు ద్రావిడులనిపించుకొనుట గౌరవహీనముగా దలపరు. ద్రావిడులని తమిళుల కేల యంత పెద్దతన మీయవలయునని తెలుగులు భావించినచో దాక్షిణాత్యులనియో ఆర్యేతరు లనియో పిలువ నంగీకరింతురు గాక!

ద్రావిడులు ఆర్యేతరులని నిదర్శనములు జూపి నిర్ధరించితిమి. ఇక నార్యేతరులలో నొకరగు కన్నడిగలు చాలకాలమునుండి దక్షిణహిందూస్థానమున నుండినవారని పలికితిమి. ఎంతకాలమునుండి యుండినవారో దాని నింత విచారింతము. కర్ణాటపదమే ప్రాచీనమను నర్థమున వాడబడుచున్నది. ఎంతప్రాచీనము? ఈ యిరువది నూఱేండ్లలో అగ్నిపర్వతప్రకోపము దక్షిణహిందూస్థానమున కలిగినట్లు లేదు. అడవియగ్గు లప్పుడప్పుడు కలిగి యుండవచ్చును. భాగవతమున నట్టి దవాగ్నిదహనము చెప్పబడియున్నది. అది యుండనీ. కర్ణాటకులు ఈ రెండువేలేండ్లనుండి కన్నడిగలై యుండుటకు వివాదమేమియు లేదు. దానికిముందు ద్వాపరాంతమున నున్న పాండవులు దక్షిణమున నుండిన వనముల వాసముజేయ వచ్చియుండిరని భారతమువలన దెలియుచున్నది. అజ్ఞాతవాసకాలమున పాండవులు కర్ణాటకమండలమున నుండిన విరాటనగరిని నివసించియుండిరని తెలియుదుము. మత్స్యభూపాలుడని విరాటరాజునకు పేరు. మత్స్యమన కన్నడమున మీను. మీన్గొంద యనునది బళ్ళారి మండలమున నున్నది. ఆలూరుతాలూకానందు చిన్నహొట్ట పెద్దహొట్టయను రెండు గ్రామములున్నవి. అవి దీనికి సమీపమునను న్నవి. ఈ పెద్దహొట్ట చిన్నహొట్ట గ్రామ

మూలుండుచోటనే విరాటనగరముండెనని స్థలపురాణము నందు వ్రాయబడినది. స్థలపురాణోక్తవాక్యము లంత విశ్వసనీయములుగావు. అయిన సత్యాంశము లేకయుండదు. గొందెయున్న కొండ. మీనగ్గొందెయున్న చేపవలెకనబడుకొండ. అట్టికొండయుండుప్రదేశము మత్స్యదేశమనబడెనేమో. ఆనెగొందె-ఏనుగుకొండ. ఏనుగువలె నాకారముగలకొండ యని భావము. శేషాచలము-పామువలెనుండు కొండ. ఇవి యాకారములబట్టి చెప్పినవాక్యములేగాని వస్తువునుబట్టి చెప్పినవిగావు ఈమీనగ్గొందెచెంతనుండిన విరాటనగరమే హాన్యటయను రూపాంతరము జెందినదని యచ్చటి జనులు చెప్పుదురు. బొంబాయి కర్ణాటమున నట్టి స్థల మొకటి గలదని యందలివా రందురు. అందుకే స్థల పురాణము లంత నమ్మదగినవి కావనుట. ఇందు సత్యాంశ ముండెనేని యది కర్ణాటకుల దయాదార్యములను,పరంపరాగతమైన ధర్మపక్షపాతమును స్థిరపఱచుచున్నది. ఇది యెట్లున్నను అర్జును డశ్వమేధహయరక్షకుడై దక్షిణ దేశరాజ్యముల నెల్ల దిరిగె. అందు కుంతలదేశమును జొచ్చె. కుంతలాధిపుడైన చంద్రహాసుని సందర్శనమును సఖ్యమును సంపాదించె. కుంతలాధీశుడు న్యాయవర్తియు, దైవభక్తుడును, శూరాగ్రేసరుడును సుందరుడును నగు చంద్రహాసుడు. ఇయ్యది కర్ణాటకుల ప్రాచీనతను చంద్రహాసునివఱకు గొంపోయినది. పితృవాక్యపరిపాలనమునకై శ్రీరాముడు దండకారణ్యమును బ్రవేశించె. అందు పంపాక్షేత్రమున వాలిని సుగ్రీవుని హనుమంతుని జూచె. శ్రీరాముడు వాలిని వధించి, సుగ్రీవునకు జేసిన కిష్కింధపట్టాభిషేకమును, సుగ్రీవాంజనేయ ప్రముఖులు సీతను రామునియెడ జేర్చుటకై చేసిన సాహాయ్యమును శ్రీమద్రామాయణమునందు వాల్మీకి మహర్షియే వ్రాసియున్నాడు. అతనికి కర్ణాటకాభిమాన మేమియు నుండియుండదుగదా? వాల్మీకి మహర్షి రామాయణమున నున్నంత, విన్నంత, కన్నంత, రామచరిత్రమును వ్రాసినాడు. కర్ణాటకదేశమున కిష్కింధ యున్నది. కిష్కింధాఖండమున పంపాక్షేత్ర మున్నది. కర్ణాటులు వీరులనుటకు రావణుని పదితలల పురుగని అంగదవినోదార్థము ఉయ్యాల కాడగట్టిన వాలిబల మొక సాక్షి. అధికారమున కర్ణాటులు దక్షులనుటకు సుగ్రీవాజ్ఞ యొక నిదర్శనము. ఆర్తుల కాశ్రయమిచ్చి దుష్టశిక్షణమును శిష్టరక్షణమును చేయుటయందును, దైవభక్తిని, పాపభీతిని, ప్రజానురక్తిని గలిగి వివేకవర్తనము జేయుట యందును కర్ణాటకులు ఆసక్తిగలవారనుటకు దేదీప్యమానమైన మారుతి సచ్చరిత్ర మొకదృష్టాంతము. కర్ణాటకుల ప్రాచీనత త్రేతాయుగమువఱకు బ్రాకినది. అయిన దాని ప్రాచీనత కృతయుగమువఱకు కన్పట్టకపోలేదు. కర్ణాటపు పశ్చిమభాగము పరశురామక్షేత్ర మనిపించుకొనుచున్నది. వృక్షములవలె నున్న కార్తవీర్యార్జునుని కరములను పరశురాముడు తన పరశువుతో దునుమె నను వర్ణన వనభూయిష్ఠమైన దక్షిణమునకే అన్వయించుచున్నది విష్ణువు చక్రమునుమాని పరశువును ధరించె ననునదియు అలంకారోక్తి గల ఆర్య ద్రావిడవైరములోని వర్ణనగా నున్నది. మలయాళులు పరశురాముని నిగ్రహానుగ్రహములకు పాత్రులైరి. వారికి చేరువనుండువారు కర్ణాటకులగు తుళువారు, పితృవాక్యపరిపాలనార్థము పరశురాముడు తనతల్లి తల గోసిన స్థల మిదియని కర్ణాటకులు హులిగిహొసూరులను జూపుదురు. అం దిప్పటికిని రేణుకాదేవి శరీరమునకు పూజ జరుగుచున్నది. ఈ విషయములనుండి జమదగ్ని యాశ్రమము కర్ణాటమున నుండెనని యూహింపవను. ఇంత ప్రాచీనత చాలును.

కర్ణాటకులు ప్రాచీనులై వీర్యశౌర్యౌదార్య న్యాయవర్తనములు గలవారొక్కటియేగాక వర్తకులై వివిధదూరదేశములకు బోయియుండిరనియు వలసబోయిన స్థలములు తెలిసినంతవఱకు గ్రీసుదేశమువఱకును ఇటలీ దేశమువఱకును వ్యాపించియుండెననియు దెలియుచున్నది. క్రీ. పూ. సాలమన్ మున్నగువారి కాలమందు ప్యాలస్టైన్, బ్యాబిలోనియా రాష్ట్రములకు నెమళ్లను దంతపువస్తువులను బంగారును సముద్రయానమం దారి జేరిన తమిళులు గొనిపోవుచుండిరని ఇతిహాసాధారముల దెలియుచున్నది. దక్షిణహిందూస్థానము, కుమారస్వామికి వాహనముగా నెన్నబడు నెమళ్లయందును, శివుని దర్పమునకు పాల్పడిన యేనుగులయందును కరాటమున వలసి

నంత కన్పట్టు బంగారువందును ప్రసిద్ధికెక్కి యుండెను. పొన్ అనిన బంగారని యర్థము. కర్ణాటకులకు, లోహములలో బంగారు మొదట కనబడియుండును. వారు బంగారువ్యాపారము చేసియుందురు. ఏలనన కర్ణాట దేశము బంగారునకు బుట్టినిల్లు. మఱియు వారు ఇనుమును కర్బొన్ = నల్లబంగారు, బెళ్పొన్ = తెల్లబంగారు అనియు వాడుచున్నారు. పొన్ అనిన లోహమని యర్థము చేసికొనినను ద్రావిడులకు లోహములు పురాతన కాలమునుండి తెలిసినవి యని తెలియుచున్నది. గ్రీసు దేశమునం దాక్సిరింకస్సను ప్రదేశమున దొరకిన గ్రీకు నాటకమునందు కర్ణాటపుమాటలు కన్పట్టుచున్నవి. దీనివలన కర్ణాటజనవ్యాప్తియును భాషావ్యాప్తియు నంతవఱ కుండెనని చెప్పవచ్చును. ఏసుక్రీస్తు భారతీయుడని రామస్వామి అయ్యరుగారు ఊహించి కారణములు జూపినది యంత నిరాధారమైన సిద్ధాంతము గాదు. ఏసు వలసపోయిన దక్షిణహిందూస్థానమువాడయి యుండవచ్చును. మేరి మరమ్మ=మారెమ్మ ఏసుతల్లి. సక్కరయ్య మొదలగు నామములును దక్షిణహిందూదేశీయు లందుండునవి. అది యటుండనిండు. మఱియొక నూతనవిషయ మే మనిన క్రైస్తవుల వేదమునందు (Bible) 'హొసన్నా' యనుపదము వాడబడినది. అక్కడివారు ఏసుక్రీస్తును హొసన్న యని పిలిచిరి. ఇది శుద్ధకర్ణాటపదము. తమిళమునుగాను, తెలుగును గాదు. తదితర విస్తృత దేశభాషలలో నిదియు గాదు. హొసన్నయన కన్నడమున క్రొత్త అన్న యని యర్థము హొసన్న=new brother. వలసపోయిన కర్ణాటకు లాతని నట్లు సంబోధించియుందురు. ఏసు దేవపితృత్వమును మానవభ్రాతృత్వమును బోధించెను (Fatherhood of God & Brotherhood of men.) దానిబట్టియే యాతడు కన్నడిగలచేత నట్లు పిలువబడెను. ఇది ఐతిహాసికోక్తి; క్రైస్తవుల వేదవాక్యము.

కర్ణాటకులు మతసహిష్ణుత గలవారు. కర్ణాటము త్రిమతస్థులకు శరణాలయమై యుండెను. వారు తొలుత వనదేవత నారాధించుచున్నట్లు కనబడుచున్నది. వారిలో తుళువారు మంచి యోధులైరి. తోడలు గొల్లలైరి. మహిషమండలము కర్ణాటములోనిది, పాలుపితుకు బర్రెలు మెండు. వానిని పోషించి పాడిచేసి బ్రదుకువారైరి. బడగలు పాడి పంట చేసికొని యుండువారైరి. తదితర కన్నడిగలు వర్తకము మొదలగు వివిధవృత్తులందును, విద్యలందును ప్రవీణులైరి. వనపర్వతప్రదేశముల నుండు కిత్తిలో నందఱును వీరవృత్తినే యవలంబించియుండిరి. ధీరోదాత్తులైన వీరు లెప్పుడును ఔదార్యభావముగలవారై యుండుట సహజము. వీరియందు నదియే కన్పట్టుచున్నది. తరువాత కర్ణాటమున పాశుపతము సంభవించినది. అటుపిమ్మట శైవము ప్రవేశించినది. అపిమ్మట వైష్ణవము చొచ్చినది. ఈమూడుమతముల సంకరము జైనమయినది. గుణగ్రహణ పారీణులగు కర్ణాటకులు ప్రస్తుతమతములను సమదృష్టిని, సమరసభావమునను సంరక్షించినారు. ఇప్పుడు మహమ్మదీయ క్రైస్తవమతములకు నట్టి స్వాగతమే యొసగబడెను. ఏమతమువారికి నట్టితొందరలు లేవు.

గీ. 'బుధునకును మూర్ఖునకు నొక్క పోల్కి గార
వంబు సేయుదు రిచ్చటి ప్రాక్యజనులు.'
— తెలుగువిశ్వగుణాదర్శము.

కర్ణాటకులు పండితపామరుల నొక్కపగిది సమాదరమున జూచుచుందురు. కన్నడిగలు మతోద్రేక మను మాట నెఱుగరు. ద్వైతవిశిష్టాద్వైతాద్వైతమతము లెల్ల ఇందు ప్రబలినవి.

కన్నడిగలు ధర్మప్రవర్తనమును, నైతికసంపత్తిని గలవారై యుండిరని కనబడుచున్నది. వారి శౌర్యౌదార్యములు రామాయణభారతములందు వర్ణింపబడియుండుటయే గాక మధ్యమయుగమునందు వచ్చియుండిన హ్యూన్త్సాంగను చీనాప్రవాసి గ్రంథమునను కర్ణాటకుల సత్యసంధతను గుఱించియు, న్యాయప్రియత్వమును గూర్చియు, శౌర్యౌదార్యములను గూర్చియు పొగడ్తయున్నది. అక్క, అమ్మ, అత్తె, మావ, గండ, హెండతి మున్నగు నామపదములుండుటం బట్టియు, ప్రకృతిశీలసంప్రదాయములం బట్టియు కన్నడిగలు సౌశీల్యము గలవారని తెలియుచున్నది. కన్నడిగ లనుకంపాపరులని తెలియుచున్నది. వారి భూతదయాబుద్ధియే అహింసాపరము లగు జైన రామానుజమాధ్వ బసవారాధ్యమతములకు సానుభూతిని,

సంరక్షణమును నొసగ తోడ్పడియుండునని తోచుచున్నది. మఱియు వారి యుదారగుణమే ప్రజారంజనము చేయు జాలు రాజవంశ మెద్దియైనను దానికి సింహాసనారోహణ సుయోగమును గలిగించినది. పూర్వకాలమునుండి వారు గణపతియధికారమున మున్నవారు. నాయకునియందు వినయవిధేయతలు చూపు అలవాటు కన్నడిగలకు మొదట నుండి యుండుటం బట్టి ప్రభువగువాడు తమజాతివాడు కాకుండినను ప్రజారంజకుడుగా నుండిన వానిపరిపాలనకు లోబడెడివారు. అందుకే అనేక రాజవంశములు కర్ణాటము నేలినవి.

కర్ణాటకులు పరిపాలనశక్తియందును పేరుబొందిన వారు. సుగ్రీవాజ్ఞయను గాథయే వారి అధికారాసక్తిని దెలుపుచున్నది. పురాణకాలపు రాజులు గాక కర్ణాటము నేలిన ఇమ్మడిపులికేశి, కృష్ణదేవరాయలు చక్రవర్తులై స్వజన స్వధర్మ స్వదేశరక్షణము జేసి ఆచంద్రతారార్కమైన కీర్తిని గడించిరి. రాజభక్తి కేమి, చక్రవర్తిభక్తి కేమి మైసూరు రాజ్యమును, బ్రిటిష్‌కర్ణాటరాష్ట్రమును ఇతర రాష్ట్రములకెల్ల నాదర్శప్రాయములుగా నున్నవి.

కన్నడిగలు లలితకళలయం దతినిపుణులు. వారి శిల్పశాస్త్రపరిజ్ఞానము చూచి కన్నులపండువు చేసికొన గోరినయెడల హంపి, ఎల్లోర, బేలూరు మున్నగుస్థలము లందుండు కట్టడములనుమాత్రము పరికించిన చాలును. ఈ కట్టడముల జూచి ప్రశంసింపని పరదేశప్రవాసియే లేడు. జాత్యభిమానమున బోడము ఈర్ష్యామూఢులను సైతము మాని వీనిని బొగడని మనుజుడే లేడు. ఇక సంగీతశాస్త్రము దన్ననో, దక్షిణహిందూస్థానపు సంగీతము కర్ణాట సంగీతమనియే ప్రసిద్ధిజెందినది. హుసితాళమును పదములు కర్ణాటపదములు. కర్ణాటసంగీతము హిందూస్థానిసంగీతము కంటెను సూక్ష్మమైనదియు, సంపూర్ణమైనదియు, శాస్త్రీయమైనదియు, సౌఖ్యదమైనదియు నై యున్నదని సమస్తజాతులవారు సమ్మతించినారు. ఇట్టి సంగీతజ్ఞానము గల కర్ణాటకుల సాహిత్యమందు సంగీతమున కేమి తక్కువ? కర్ణాటసాహిత్యమునందు పాడుంగబ్బమని యొకసాహిత్యవిశేషమే గలదు. కర్ణాటకులు సంగీత ప్రియు లగుటంబట్టియే

‘ బిందువిసర్గం వ్యంజన
మొందిద దడ్డక్కరల పదాంత్యం దీర్ఘం.’
—నాగవర్మఛందస్సు.

అని పాదముయొక్క కడపటి లఘువును సైతము గురువుగా జేసికొని విడిచినారు. తెలుగునం దిట్టి స్వాతంత్ర్యము లేదు. పదియవ శతమానమునం దుండిన కావ్యమీమాంసాకర్తయగు రాజశేఖరుడను సంస్కృతకవి కర్ణాటకులు పద్యములను టంకారముతో చదువుదురని సోంకముగా బలికినాడు. హిందూస్థాని సంగీతము ఆర్యసంపర్కము గలది. అయ్యది ఆహాహూహాహూశబ్దనలతో మునిగియుండు. కర్ణాటసంగీతమున్న సప్తస్వరముల సూక్ష్మోచ్చారణములతోను, రాగతాళరక్తితోను హృదయానందకరముగా నుండు. సప్తస్వరముల ధ్వనులు వన్యమృగపక్షులధ్వనులతో పోల్పబడినవి. వనగిరులందు వసించుచుండిన కర్ణాటకుల చెవి కివి చిన్నప్పటినుండియే తెలిసియుండును. ఈ కారణమునుబట్టియే కాబోలు, కర్ణాటకులు సంగీతకళయందు ప్రవీణులైరి. వీణను కర్ణాటకులే కనిపెట్టియుందురు. సంగీతము నెఱింగినవారు సాధనముల జేసికొనకయుందురా? వీణకు వలసిన కఱ్ఱ, సొరకాయ, తంతులు కర్ణాటకుల కున్న చోటనే దొరకువస్తువులు. వీణసింహాముఖము సకీలతము వన్యజాతికర్తృత్వమును వెల్లడించుచున్నది. వనపర్వతప్రాంతముల నివసించుచుండిన ద్రావిడులు పాములను నయభయభక్తులతో జూచుచుండిరి. వానిని జంపిన పాపమని భావించుచుండిరి. అయిన విషప్రాణియైన నాగమునుండి తప్పించుకొనుటకై విషపద నలనైన తల లాపజేసి శ్రోత్రేంద్రియపరవశులుగా జేయు జాలు మంగళకరమైన నాగస్వరమునుకూడ సంగీతమునందు సహజమైన పాండిత్యముగల కర్ణాటకులే కనిపెట్టియుందురు. నాగములు చక్షుఃకర్ణము లగుట వినువపుడు కనుగొనజాలవు. అట్టివేళ ద్రావిడులు వానినుండి తొలగి పోవుచుండిరి. ద్రావిడులు నాగస్వరము వాయించుటయందు నిపుణులనుట లోకప్రసిద్ధము. ఇట్లు కర్ణాటకులు సంగీతమును, సంగీతసాధనములను వృద్ధికి దెచ్చినవారు. సంగీతసాహిత్యసమ్మేళనము జేసిన కర్ణాటకులలో పురందరదాసు ముఖ్యుడు. అతడు ఆనందమత సాహిత్యము

తోపాటు సంగీతమును చేర్చి పాటల వ్రాసి త్యాగరాజులకు ఆదర్శకవి యైరెను.

క. 'దురితవ్రాతము లెల్లను
బరిహార్యంబులు హరిగుణముల బాడుచు నెపుడున్
పరవశుడై విలయపురం
దరదాసుని మహిమములను దలచెద మదిలోన్.'

అని త్యాగరాజు తన ప్రహ్లాద భక్తవిజయ మను రూపకమున పురందరదాసుని ప్రస్తుతించినాడు. త్యాగరాజు కృతుల నెల్ల ద్వైతము నిండియున్నది. హరిహరులను భాగవతసంప్రదాయమున సమముగా స్తుతించినాడు గాని ద్వైతాద్వైతమతభేదమును శాస్త్రానుసారముగా గుర్తింపక పోయినాడు. 'ద్వైతము సుఖమా? అద్వైతము సుఖమా?' యని డోలాయితమనస్కుడై పోయినాడు. అయిన ననుభవమున ద్వైతమునే యనుసరించినాడు. తన సాహిత్యమందు దతడు రామదాసోహమ్మని పలుమారులు పలికియుండినను శ్రీరాముడు తనదాసుడైన త్యాగరాజును 'పదిపూటలపై గాచెద'నని పలికియుండినను, కొంద ఱితని సాహిత్యమును, స్వభావస్వానుభవములను వేఱుగా దలచుచున్నారు. పురందరదాసులు భావకవిత్వమును సంగీతముతో గలిపి, పండితపామరరంజకముగా త్యాగరాజు సంగీతమును భావకవిత్వముతో గలిపి శాస్త్రజ్ఞులు కలబోసి కర్ణాటసంగీతకీర్తిని కేంద్రస్థానము చేర్చిరి. ఇంతియె కాదు కర్ణాటకులు నాట్యకళయందును అసమాన పాండిత్యము గలవారు. నాట్యము తాండవము, లాస్యమని ద్వివిధము. తాండవము పురుషనాట్యము, లాస్యము స్త్రీనాట్యము. తాండవము ద్రావిడులదైనను శివుని నాట్యమగుటచే నది పురుషనాట్యముగా భావింప బడియె. శివునకు మహానటుడను బిరుదు గలదు. నాంది శివునిభక్తుడగు నంది మంగళవాక్యము. కొడగువారియం దిప్పటికిని తాండవమాడు వాడుక గల దందురు. మైసూరు మొదలగు కర్ణాటదేశపువారి నాటకప్రదర్శనపాండిత్యము సర్వజనవిదితము. ఉష్ణమండలమునందు వేడిమి, వెలుతురు నుండుట నచిరకాలములోనే వస్తువులు పక్వము లగునని ట్రిక్కడివారి బుద్ధియు శీతలమండలమువారి బుద్ధికంటెను శీఘ్రకాలములోనే పరిపక్వమగుచున్నదని ప్రఖ్యాతభూగోళశాస్త్రజ్ఞుల సిద్ధాంతము; అనుభవవేద్యము. జలసమృద్ధియందును, ఫలాహారసమృద్ధియందును కొదవలేని యుష్ణమండల ప్రదేశములందు జనులకు జీవనోపాయప్రయత్నము లల్పవిషయములై యుండుట వారు విశ్రాంతిని మెండుగా గలవారై యుందురు. అట్టి విశ్రాంతి కాలమున వారు సకల తత్త్వశాస్త్రశ్రద్ధాపరులై యుందురనియు, సహజముగనే కుశాగ్రబుద్ధి గలవారై యుందురనియు మానవచరిత్రము నుండి మనము తెలిసికొనవచ్చును. ద్రావిడు లుష్ణమండలమున నుండువారు. అందువను కర్ణాటకులు సుందరదేశమున నుండువారు. వారు సకలశాస్త్రములందు ఘనపాండిత్యమును గడించిరి. కనుకనే వారిట్లు వర్ణింపబడినారు.

గీ. 'వేదముల నభ్యసింపక వీరు శాస్త్ర
వాదముల నెల్లవేళల నాదరింత్రు.'

— తెలుగు విశ్వగుణాదర్శము.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'

(వెనుకటి సంచిక తరువాయి)

## ౫

(ఇది ౮ వ గుహయొక్క వెనుకటిట్టు గోడపయిన ద్వారమునకు కుడిప్రక్కగా నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ దాసకస ముగూదాసకస[1] సపరివారస లెణ[2] దెయ ధమ[3].

### సంస్కృతము (ఛాయ)

౧ దాశకస్య ముగూదాసస్య సపరివారస్య లేణం దేయధర్మమ్.

### ఆంధ్రీకరణము

ఈ గుహను సపరివారుడయి ముగూదాసుడు ధర్మముచేసినాడు.

### సంగ్రహవ్యాఖ్య

'సపరివార' శబ్దమునకు సరియైన అర్థము చెప్పుట కష్టమని పాశ్చాత్యదేశపు పండితులు అభిప్రాయపడిరి. భారతదేశీయులకు సపరివారు డన్నమాటకు అర్థము సులభముగా తెలియుచున్నది. కొందరూహించినరీతిగా 'సకుటుంబముగా' నని యనుకొనినచో లేఖరి అట్లు అర్థమిచ్చు బంధుత్వమును దెలుపు పదముల నేల వాడియుండ లేదని ప్రశ్న వచ్చుచున్నది. అందువలన 'సపరివారు' డనగా చుట్టును కొలిచియున్నవారలతోగూడి యనిగాని భిక్షులతో కలసి యనిగాని అన్వయము చేసుకొనవచ్చును. ఈ ముగూదాసుడు దాశకుడు. ఈతని పేరుగలవాడు "మాలాకారు" డొకడు కూడ నితని సమకాలికు డనదగువాడు కలడు. అతనిగూర్చి ముందు తెలుపబడును.

## ౬

(ఇది ౮ వ గుహయొక్క వసారా వెనుకటిగోడపయిన ద్వారమున కెడమప్రక్క నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ చెటిక-ఉపాసకియస ముగూదాసస[1] సపరివారస లెణం[2] దెయధమ[3]

ఎతస లెణస[4] బొధిగుత-

౨ ఉపాసకస పుతేన ధమనందినా దతం[5] ఖెతం[6] అపరిలీయ కణ్హాహినియ

ఎతో చ ఖెతాతో చీవరికం[7] పవైతస.

౧. 'ముగుడా' యని చదువవచ్చును. రెండవఅక్షరముపై దీర్ఘము కానుపించుటలేదు. ౨. లెణం. ౩. ధమం.
పాఠభేదములు:—౧. మూగూ. ౨ లెణ. ౩. ధమొ. ౪. లెణస. ౫. దత. ౬. ఖెత. ౭. చివారిక.

## సంస్కృతము (ఛాయ)

౧ చేటిక ఉపాసకీయస్య ముగూదాసస్య సపరివారస్య లేణం దేయధర్మమ్.
ఏతస్య లేణస్య బోధిగుప్త
౨ ఉపాసకస్య పుత్రేణ ధర్మణనందినా దత్తం క్షేత్రం అపరస్థలీయ కణ్హహి
నీయ ఏతత్ చ క్షేత్రం చీవరకం పరివ్రాజకస్య.

## ఆంధ్రీకరణము

'చేటిక' సంఘమునకు చెందిన ఉపాసకుడు ముగూదాసుడు సపరివారుడై యీగుహను ధర్మముచేసెను. ఈ గుహయందు నివసించు పరివ్రాజకులకు వస్త్రములనిమిత్తము పడమటికణ్హహిని గ్రామమునం దున్న ఒకపొలమును ఉపాసకుడైన బోధిగుప్తుని పుత్రుడు ధర్మణనందనుడు దానముచేసెను.

## సంగ్రహవ్యాఖ్య

ఈ శాసనమును, పై శాసనమును సరిపోల్చి చూచునది. 'చెటిక' కులము అనునది ఈకాలమున నేసులమునకు సంబంధించినదో యని యూహ పొడముచున్నది. చెటికకులమువాడైన ముగూదాసుడు చేపలబట్టువృత్తి చేయుచున్నాడు. చెటిక ఇప్పటి చెట్టి, లేక సెట్టికులమున కేమైన వర్తించునా? ఇంకను విమర్శింపవలసియున్నది. ఈ శాసనమునందు "అపరిలీయ కణ్హహినియ" అను పదములు అర్థముగాకున్నవి. 'అపరిలీయ' 'అపర' (పశ్చిమ) శబ్దముయొక్క విశేషణమా యని సందియము కలుగుచున్నది. ఈ రూపము ఎక్కడను కనబడదు. పరియు పై పల్లవశాసనమందు పేర్కొనబడిన 'అపర కఖడియ' అను పదములందలి 'అపర' శబ్దమునకు సరిపోవుటలేదు. 'అపర కణ్హహినియ' గ్రామమున గల యీ దత్తక్షేత్రనామముగూడ కానబడదు. ఇంతికును 'అపరిలీయ' పదము సందిగ్ధముగానుండి బోధపడకున్నది.

## ౧౦

(ఇది పదియవగుహయొక్క వసారాలోని వెనుకతట్టు గోడపైన పైకప్పునకు క్రింద నున్నది.)

## మూలము: ప్రాకృతము

ఈ శాసనమును డాక్టర్ హెర్ జల్ గారు ఇండియను ఆంటిక్వేరీ ౧౨వ సంపుటము ౨౭వ పుటయందును డాక్టరు భండార్కరుగారు ౫౦వ ౧౩౯ పుటయందును ప్రకటించియున్నారు. చదువరులు పరిశీలింపదగును.

౧ సిద్ధమ్. రాజ్ఞః క్షహరాతస్య క్షత్రపస్య నహపానస్య జామాతా౧ దీనీక
పుత్రేణ ఉషవదాతేన త్రిగోశతసహస్రదేన నద్యా బార్ణాసాయాం
సువర్ణదానతీర్థకరేణ దేవతాభ్యః బ్రాహ్మణేభ్యశ్చ షోడశగ్రామదేన
అనువర్షం౨ బ్రాహ్మణ శతసహస్రీ భోజాపయిత్రా

---

౧. 'జామాత్రా' లో 'త్రా' స్పష్టముగా తప్ప గానవచ్చుచున్నది. ఇది లేఖకదోషము 'త' కు క్రింద ఉకార మిచ్చినట్లు కనబడుటచేత 'జామాతు' అనికూడా చదువవచ్చును. ౨. 'వర్ష'

౨ ప్రభాసె పుణ్యతీర్థె బ్రాహ్మణెభ్యః అష్టభార్యాప్రదేన భరుకఛె దశపుర గోవర్ధనె శోర్పారగె చ చతుశాలావసథ ప్రతిశ్రయప్రదేన ఆరామ తడాగ[3] ఉదపానకరేణ ఇబా పారాదా దమణ తాపీ కరబెనా దాహనుకా నావా పుణ్యతరకరేణ ఎతాసాం చ నదీనాం ఉభతో తీరం సభా–

3 ప్రపాకరేణ పిండీ[4]తకావడె గోవధనె సువర్ణముఖె శో[4]ర్పారగె చ రామతీర్థె చరకపర్షభ్యః గ్రామె[5] నానంగోలె ద్వాత్రీశతనాళీగెర మూల సహస్రప్రదేన[6] గోవధనె త్రిరశ్మిము పర్వతెషు ధర్మాత్మనా ఇదం లెణం[7] కారితం ఇమా చ పోథియో[8] [||*] భటారకా అంజ్ఞాతి య[9] చ గతోస్మిం[10] వర్షారతుం మాల యె హి రుధం ఉతమభాద్రం[11] మొచయితుం

౪ తె చ మాలయా ప్రసాదెనెవ అపయాతా ఉతమభద్రకానం[12] చ క్షత్రియానం సర్వె పరిగ్రహా కృతా తతోస్మి[13] గతో పొక్షరాణి తత్ర చ మయా అభిసెకొ కృతో త్రీణి[14] చ గోసహస్రాణి దతాని గ్రామొ[15] చ [||*] దతచానెన[16] క్షెత్రం[17] బ్రాహ్మణస వారాహిపుత్రస అశ్వభూతిస హథెకినితా మూలెన[18] కాహాపణసహస్రెహి చతుహి ౪౦౦౦ య సపితు సతక నగరసీమాయ ఉతరాపరాయ దీసాయ[19] ఎతో మమ లెణె వస—

౫ తానం[20] చాతుదీసస[21] భిఖుసఘస ముఖాహారో భవిసతి.

సంస్కృతము (ఛాయ)

౧ సిద్ధమ్! రాజ్ఞః క్షహరాతస్య క్షత్రపస్య నహపానస్య జామాత్రా దీనీక పుత్రేణ ఋషభదత్తేన త్రిగోశతసహస్రదేన నద్యాం బార్ణాసాయాం

3. 'తడాగ' ౪. 'పిండీ' ౫. 'గ్రాము' ౬. 'సహస్రదెన' ౭. 'లెణ' ౮. 'పొధియొ' ౯. 'అం జ్ఞాతియా' యందు 'అ' తరువాత అనుస్వారము పొరపాటుచేత లేఖరి వ్రాసియుండవచ్చును. ౧౦. 'స్మి' ౧౧. 'ఉత్తమ భద్రం' ౧౨. 'కానాం' ౧౩. 'స్మి' అనుస్వారము తప్పు. ౧౪. 'తీనిగొస' ౧౫. 'గామొ' ౧౬. 'చానెన' ౧౭. 'క్షెత్ర' ౧౮. 'మూలె' ౧౯. 'దిసా' ౨౦. 'తాన' అనుస్వారము తప్పు. ౨౧. 'చతుదిస'

సువర్ణదాన తీర్థకరేణ దేవతాభ్యః బ్రాహ్మణేభ్యశ్చ షోడశగ్రామదేన
అనువర్షం బ్రాహ్మణశతసహస్ర భోజయిత్రా

౨ ప్రభాసే పుణ్యతీర్థే బ్రాహ్మణేభ్యః అష్టభార్యాప్రదేన భరుకచ్ఛే దశపురే
గోవర్ధనే శోర్పారగే చ చతుశ్శాలావసథ ప్రతిశ్రయప్రదేన ఆరామ
తటాక ఉదపానకరేణ ఇబా పారాదా దమన తాపీ కరబేన దాహ
నుకా నావా పుణ్యతరకరేణ ఏతాసాం చ నదీనాం ఉభయతీరం సభా

3 ప్రపాకరేణ పిండీతకావడే గోవర్ధనే సువర్ణముఖే శోర్పారగే చ రామతీర్థే
చరకపర్షభ్యః గ్రామే నానంగోలే ద్వాత్రింశత నాళికేర మూలసహస్ర
ప్రదేన గోవర్ధనే త్రిరశ్మిషు పర్వతేషు ధర్మాత్మనా ఇదం లేణం కారితం
ఇమాం చ పృథివీం భట్టారకైః ఆజ్ఞప్తశ్చ గతోస్మి వర్షర్తుం మాల
యైః రుద్ధం ఉత్తమభద్రం మోచయితుం

౪ తే చ మాలయాః ప్రనాదేనేవ అపయాతాః ఉత్తమభద్రకానాం క్షత్రి
యానాం సర్వే పరిగ్రహాః కృతాః తతోస్మిన్ గతః పుష్కరాణి తత్ర
చ మయా అభిషేకః కృతః త్రీణిచ గో సహస్రాణి దత్తాని గ్రామశ్చ
దత్తం చా నేన క్షేత్రం బ్రాహ్మణస్య వారాహిపుత్రస్య అశ్వభూతేః
హాథేకీనితా(?)* మూల్యేన కాహాపణ సహస్రైః చతుర్భిః సపితు
సుతక(?) నగరసీమాయ ఉత్తరాపరదిశాయ ఏతన్మమ లేణే వస

౫ తః చాతుర్దిశస్య భిక్షుసంఘస్య ముఖాహారో భవిష్యతి.

ఆంధ్రీకరణము

స్వస్తి! క్షహరాత క్షత్రపుడను రాజును అగు నహపానుని అల్లుడును, దీనీకుని పుత్రుడును, అగు ఋషభ దత్తునిచేత నీయబడిన ధర్మము: దేవతలకును బ్రాహ్మణులకును బార్ణాసావదియొద్దను మూడులక్షలగోవులను దానము చేసినవాడును, సువర్ణదానములను తీర్థములను (తిరువాళ్లు) జరిపించినవాడును, షోడశగ్రామములను బ్రాహ్మణుల కును దేవతలకును దాన మొసంగినవాడును, అనువర్షము (సంవత్సరపర్యంతము) శతసహస్రసంఖ్యాకులగు (లక్షమంది) బ్రాహ్మణులకు భోజనములు పెట్టువాడును. 'ప్రభాస' పుణ్యతీర్థమున బ్రాహ్మణులకు అష్టభార్యల నొసంగినవాడు ను*, భరుకచ్ఛ, దశపుర, గోవర్ధన, శోర్పారగ నగరములందు వాసయోగ్యము లయిన చతుశ్శాలా (నాలుగిండ్ల భవంతివంటిది, చుట్టును వసారా గలిగినటువంటిది) సత్రములను కట్టించినవాడును, ఆరామ, తటాక, ఉదపానము

*. ఇదియేమో నాకు తెలియుటలేదు. ఒక క్షేత్రము పేరా యని సందేహము కలుగుచున్నది. ఇంకను ఈ విషయము విచార్యము.

*. వ్యాఖ్య చూడుడు.

(పశువులుం నీరు త్రాగు తొట్టెలవంటివి?) లను నిర్మించినవాడును, ఇబా, పారాదా, తాపీ, కరబెనా, దాహనుకా నదులను ఉదిత్రముగా దాటించుటకై పుణ్యముగొఅకు నావలు వేయించినవాడును, ఈ నదుల యుభయతీరము లందును విశ్రాంతిమందిరములను, పానీయశాలలను (చలివేంద్రలు) నిర్మించినవాడును, 'నానంగొలా' గ్రామమున ముప్పదిరెండువేల నారికేళమూలములను (కొబ్బరితోటయా?) (కొబ్బరి అంట్లుగాని, మొక్కలుగాని కావచ్చును) పిండీతకావడ, గోవర్ధన, సువర్ణముఖ, శోర్పారగము, రామతీర్థము మొదలగు నగరములందు గల చరకసంఘముల (యజుశ్శాఖీయు లగు బ్రహ్మచారులు గావచ్చును) కు దానముచేసినవాడును అగు ఋషభదత్తుడు ధర్మచింతతో ధర్మాత్ముడై గోవర్ధనమం దున్న త్రిరశ్మి పర్వతములపై యీ గుహను ఇందలి నీటిగుండములను దొలిపించి దానము చేసెను. [నేను] భట్టారకుని (రాజు) చే యాజ్ఞాపింపబడి ఉత్తమభద్రుల నాయకుని వర్ష ఋతువులో మాలయులచే (దక్షిణ కొంకణవాస్తవ్యులు కావచ్చును) బంధింపబడినవానిని చెఱనుండి విముక్తునిచేయుట కరిగితిని. వారాక తెలిసి నట్లుగానే మాలయులు భీతచిత్తు లయి పారిపోయిరి. అంతట ఉత్తమభద్రకులచేత వా రందరు పట్టుకొనబడి బంధింపబడిరి. అప్పటినుండి (పుష్కరిణి) పొష్కరతటాకమున కరిగి యందు స్నాన మాచరించి మూడువేల ఆవులను ఒక గ్రామమును దానము చేసితిని. అప్పటనే వారాహి (భట్టు) కుమారుడైన 'అశ్వభూతి' వలన అతనికి పైతృకమైనట్టియు, పూర్వార్జితమైనట్టియు తనకు నిరాటంకముగా సంక్రమించినట్టియు పొలమును, మరియు నగరసీమలందు ఉత్తరాపరదిశ (వాయవ్యదిశ)గా నున్న 'మాభేకీనిత' యను పొలమును రెంటెని నాలుగువేల కాహాపణములు మూల్య మిచ్చి క్రయమునకు తీసుకొని దానముచేయుచున్నాను. నేను దొలిపించిన యీ గుహయందు మార్గస్థులుగావచ్చి నాలుగుదినము లుండిపోవుచుండు భిక్షుకసంఘమునకు, ఈ దత్తిక్షేత్రమునుండి వచ్చు ఫలాదాయములు ముఖ్యాహారమై సాగుచుండవలయును.

## సంగ్రహవ్యాఖ్య

ఈ శాసనములో మొదటిభాగము అనగా 'అష్టభార్యా ప్రదేన' అను పదనారంభిముగలుగు గల వాక్యము ఒకటిరెండు స్వల్ప పాఠభేదములతో తప్ప కార్లీ గుహాశాసనములలో ౧౩ వ దానితో సరిపోవుచున్నది. ఈ విషయమును కార్లీ గుహాశాసనములను సంపాదించి ప్రకటించినపుడును చర్చింతును.

'అష్టభార్యా ప్రదేన' అనుటచేత ఒక్కొక్కనికి ఎనమండుగురు భార్యల నిచ్చిన అని యర్థముచెప్పుట నా కంత సమంజసముగా తోచుటలేదు. ఆకాలమున నట్టి యాచార మేమయిన నుండెనేమో మనకు తెలియదు. అయినను నా కొకయూహ పొడముచున్నది. అది వింత యని కొందఱకు తోచవచ్చును. పురాణములందు మనకు తెలిసినంతవఱకు అష్టభార్యాయుతు డొకడే యున్నాడు. అతడు శ్రీ కృష్ణుడు. మన సహపానుని కాలమునాటికి శ్రీ కృష్ణుని పరమాత్మస్వరూపుడుగ పరిగణించి ఆరాధించుట బ్రాహ్మణులలో నాచార మైనట్లు గానవచ్చెడిని. అందుచేత శ్రీ కృష్ణభగవానునకు అష్టమహిషీకళ్యాణము గావించి యా సువర్ణవిగ్రహములను బ్రాహ్మణులకు దానము చేయుచుండువా డని యర్థము చెప్పవలయును. పండితులు దీని నింకను విమర్శింతురుగాక.

దశపురము తక్క మిగిలిన నగరము లన్నియు నీవఱకే నిర్ధారింపబడియున్నవి. ఈ దశపురము మాళవమందలి మందసోర్ అని ఫ్లీటుపండితుని యభిప్రాయము. (గుప్తచక్రవర్తుల శాసనములు, పుట ౭౯. ౨ వ నోటు) మాళవ రాజపుత్రస్థానమం దున్న దశపురమయినచో నదియే గావలయును. ఇచ్చట శకజాతులు నివసించుచుండినట్లు ముందు ౨౦ వ శాసనమందు తెలుపబడియున్నది. కావున నీ పుర ముత్తరప్రాంతమున నున్నదే యని నిర్ధారింపవచ్చును.

సిండీతకానడ, సువర్ణముఖి, ఇంతవఱకు నిర్ధారణ చేయబడియుండలేదు. నానంగోల గ్రామము తాణా నది మీద సంజాము నగరమునకు సమీపముగా నాలుగుమైళ్లదూరమున నున్న నార్గోలు గ్రామమునకు సరిపోవుచున్న దని భగవన్‌లాల్ ఇంద్రాజీ పండితుడు ముడిపెట్టుచున్నాడు.

‘చరక పర్షత్భ్యః’ అనగా బౌద్ధ (మహావస్తు ౩, ౪౧౨.) జైనగ్రంథములందు ‘అన్యతీర్థంక చరక పరివ్రాజకా’ అని పేరుతో గానవచ్చెడి. బ్రాహ్మణసన్యాసులు గావలయునని యూహ పొడముచున్నది. అయినను చరకశాఖీయులు అనగా యజుశ్శాఖీయు లగు బ్రాహ్మణు లని యర్థము చెప్పుటకు వీలుగలదు.

‘గోవర్ధనము’ నాసికకు ఆరుమైళ్లు దూరములో నున్న ‘గోవర్ధన’ గంగాపురము కావలయును. ‘సోపారా’ తాణాజిల్లాలో ‘బేసిను’కు సమీపముగా నున్నది. ఇప్పటికి నచ్చట ‘రామకుండమ’ని యొక కోనేరును చూపించుచుందురు. ఇందు స్నాన మాచరించుటవలన పుణ్యము ప్రాప్తించు నని జనుల విశ్వాసము. భరుకచ్ఛము నేటి బ్రోచ్ పట్టణ మనుట నిస్సంశయము.

ఇందు పేర్కొనబడిన నదులను భగవన్‌లాల్ ఇంద్రాజీ పండితు డీవిధముగా నిరూపించుచున్నాడు ఇబానది అంబిక, పారాదానది పార్, కరబెనా నది గుజరాత్ దేశమునం దున్న కావేరి, దమన నది దమణ గంగ దహనుకానది నేటి దహాను ఉప్పుటేరు బర్ణాసానది సంస్కృతమున పురాణములందును మహాభారతమునందును పేర్కొనబడిన పర్ణాశానదితోడను, రాజపుత్రస్థానములోని బానాస్ యేటితో పరిపోల్పవచ్చును. పర్ణాశానది అబూపర్వత శిఖరప్రాంతమున జనించి కచ్ఛి సింధుశాఖలో కలియుచున్నది. బానాస్ చంబల్ నదికి ఉపనదిగా నున్నది. వీటిలో రెండవదానితోటికంటె మొదటిదానితోడనే బార్ణాసానదిని ముడిపెట్టవచ్చునని పండితుల యభిప్రాయము. బానాస్‌నది వర్ష కాలమున తప్ప నితరఋతువులందు ప్రవహింపదు. కావున ఋషభదత్తుడు అచ్చట నదిలోనికి సోపానములు కట్టింపవలసిన అవసరము కలిగియుండ దని వారి యూహ.

ఈ శాసనమునందు పేర్కొనబడిన దానపతి నహపానునృపాలుని యల్లుడు ఋషభదత్తు డనువాడు. ఈతడు బ్రాహ్మణుడు లేక బ్రాహ్మణమతావలంబకుడు. ఈ శాసనమం దాతడు పూర్వము బ్రాహ్మణులకొఱకు జేసిన మహాదానము లన్నియు నుదాహరింపబడియున్నవి. అతడు బ్రాహ్మణుడయినను, అప్పటి కాలధర్మానుసారముగా గాబోలు బౌద్ధ భిక్షుసంఘమునకుగూడ కొన్ని దానములను చేసినాడు. ఇంతమాత్రమున కొందఱు పండితులు తలంచినట్లు ఋషభదత్తుడు బ్రాహ్మణ్యమును వీడి బౌద్ధమతమును స్వీకరించుటచే జరిగియుండెనని తలంపరాదు. ఈ దానములబట్టి యాతని ఉదారశీలతయు, త్యాగబుద్ధియు, పరమతసహనమేగాక, పోషణచింతయు మనకు తేటపడుచున్నవి. ఈ త్రిరశ్మిపర్వతముపై ఈ శాసనమున్న పెద్దగుహను (౧౦ వ సంఖ్యగా ఆర్కియాలజికలు డిపార్టుమెంటువారిచే గుర్తింపబడుచున్నది.) ఇరువదిమంది బౌద్ధభిక్షువులు సుఖముగా వర్షఋతువులలో నివసించుటకనుకూలమైనదానిని దొలిపించి, ఋషభదత్తుడందు సంచారముచేయుచు నాలుగుదినము లుండుచు పోవుచు నివసించు సన్యాసులకు భోజనాదికవసతులు విరివిగా నేర్పఱచినాడు.

ఇందు పేర్కొనబడిన ఉత్తమభద్రు లెవరో యింకను రూఢికపడలేదు. మాలయులు ఎవరోకూడ తెలియుటలేదు. వీరు మలయపర్వతవాసు లనుటకంటె, మహారాష్ట్రవాసు లయిన మావళేలు అగుదురా యని సందియము కలుగుచున్నది. పోఖర లేక, పొష్కర అనునది అజ్మీరునకు ఏడుమైళ్లదూరములో నున్న ‘పుష్కర్’ కావలయును.

(సశేషము.)

---



కాటరాయందలి బోధిసత్వవిగ్రహము
ఎత్తు 2 అ. 8¾ అం



జమాల్ పురపు పాటిదిబ్బయందలి బుద్ధవిగ్రహము;
గుప్తయుగమునాటిది
ఎత్తు 7 అ. 2½ అం.

# ఆకస్మిక ఛాయాచిత్రములు



ఒంటిమిట్ట కోదండరామస్వామి దేవాలయపు లోపలిభాగము



భిన్నభావములు



విశాఖపట్టణము

ఛాయాచిత్రకారుడు : ద్వారము జగన్నాథరావుగారు.



తుపాను

ఛాయాచిత్రకారుడు : యన్. వెంకటరావుగారు.

# సర్ హమ్ఫ్రీ డేవీ

జి. వి. రాఘవరావు గారు, బి. ఏ. బి. యల్.

విద్యుద్దీపములను, పొటాసియమ్ మొదలగు ధాతువులను, క్షేమదీపికలను గనిపెట్టి లోకమునకు మహోపకారము చేసిన డేవీ యను పరిశోధకుడు ఇంగ్లండు దేశములోని 'పెజాన్సు' పురమున ౧౭౭౮ సంవత్సరము డిసెంబరునెల 17 వ తేదీని జననము నొందెను.



సర్ హమ్ఫ్రీ డేవీ

ఇతని పూర్వులు పురాతన కాలమునుండి గౌరవముగా కాలక్షేపము చేయుచుండిరి. ఇతనితండ్రి కొయ్యనగిషీ పనివాడు. వీరియింటి పొరుగున 'టాంకిన్' అను ఘనవైద్యుడొకడు కాపుర ముండెను. అతడు మంచి భాగ్యవంతుడు. అతనికి వీరికుటుంబముపై చాల యభిమాన ముండెను.

డేవీ అయిదారుసంవత్సరముల ప్రాయముగల బాలుడై యున్నపుడు తలిదండ్రులు వానిని బడి కంపించిరి. కాని యాబాలు డెపుడును పాఠములు సరిగా చదివెడివాడు కాడు. చిత్రలేఖనమునందును, వనవిహారమునందును వానికిగల ప్రీతి బడికిపోయి పాఠములు చదువుటలో కనబడకుండెను. ప్రగల్భోక్తులు చెప్పి తోడిబాలుర విస్మితులజేసి యాడించుటలో నితనికి మరియొకడు సాటిలేకుండెను. మంచి మంచి పద్యము లింపుగా చదువుటయందును, వినువారు హాయిచెందునట్లు చక్కగా పాటలు పాడుటయందును, కథలు రసవంతముగా కల్పించి చెప్పుటయందును బహు సమర్థుడు. కనుక తోడిబాలురందరు నితనిచుట్టు జేరి కథలు చెప్పుమనియు, పాటలు పాడుమనియు కోరుచుండిరి. 'అల్లులలో మల్లుపెద్ద' యని వారికందఱకు నితడే పెద్ద యయ్యెను. రాజులను గూర్చియు, యుద్ధములను గూర్చియు నితడు చెప్పుకథలు చెవులారవిని తోడిబాలకులు వీరరసపూరితులై కఱ్ఱకత్తులను, అట్టల డాళ్లను పట్టుకొని యుద్ధములకు బయలు వెడలుచుండిరి. వేట తమకముచేత కొందఱు అతనితో గూడ సమీపమున నున్న కొండలమీదకు బోవుచుండిరి. మఱియొకప్పుడు వా రందరును సాయంతనవిహారమునకు సముద్రమున కరిగి, ఆ తీరమందు బడియున్న గవ్వలు, గువ్వలు, చందమామలు నేఱుకొని వినోదించుచుండిరి.

ఈసందర్భములో చదువు నన్నమగుచుండెనని వేరే చెప్పవలెనా? పాఠములు సరిగా

అప్పకెప్పకపోయినపుడు ఉపాధ్యాయుడు డేవీ చెవులు రెండును నులిపి బుద్ధి చెప్పుచుండెను. ఒకనా డాకొంటెబాలుడు రెండు చెవులకును బంకపట్టించుకొని బడికి వచ్చెను. అది చూచి ఉపాధ్యాయుడు "ఏమిరా! అబ్బాయి! చెవుల కేమో పట్టించుకున్నా వేమి?" అని యడిగెను. "మీరు మాటిమాటికిని నా చెవులు నులిమి నలుగురిలో నన్ను చిన్నబుచ్చుచున్నారు. ఇక నాలాగు నులిపినపక్షమున మీచేతికంటుకొనుటకు నా చెవులకు బంకపట్టించుకున్నా"నని డేవీ ప్రత్యుత్తరమిచ్చెను.

బడిసంగతి యిట్లున్నను వీరి యింటిపొరుగుననున్న ఘనవైద్యునికడ నితనికి చాల చనువుండెను. ఈవైద్యునియొద్ద నీబాలుడు విద్యుద్యంత్రములను గూర్చియు, లేడెన్ సీసా (Leyden-Jar)ను గుఱించియు, వోల్టామహాశయుడు కనిపెట్టిన విద్యుద్ఘటమాలను (Voltaic Cells and battery) గూర్చియు పెక్కు సంగతులు తెలిసికొని స్వయముగా కొన్ని ప్రయోగములుకూడ చేసెను.

ఇంతలో నితనితండ్రి కాలము చేసెను. తరువాత వీరిపొరుగుననున్న వైద్యుడు టాంకిన్ దొర యీబాలునిపై మరింత యభిమానముంచి తరిఫీదునిమిత్తము (Apprentice) ఇతనిని వేరొకవైద్యుని కప్పగించెను. ఆ వైద్యుని మేడమీదగదిలోనే ఇతని శాస్త్రపరిశోధనమారంభమయినది. వైద్యగురుని మందులు, మ్రాకులును, వంటయింటి పాత్రసామగ్రులను మేడమీద నొకగదిలో పెట్టి, అదే ప్రయోగశాల (Laboratory) గా నేర్పఱచుకొని డేవీ పరిశోధనలు చేయ నుపక్రమించెను. అపుడే ధర్మాత్ముడొకడు ఒక గాలిపంపు (Air-Pump) లు అపిన్నవానికి బహుమానముగా నిచ్చెను. కనుక ప్రకృతి శాస్త్రవిషయములను గూర్చిన విజ్ఞానము వృద్ధిచేసుకొనుటకు అతనికి కావలసినన్ని యవకాశము లేర్పడినవి. డేవీ సహజముగా మంచి ధైర్యశాలి. ఒకప్పుడితనిని కుక్క కఱచెను. ఆ సంగతి యెవ్వరితో చెప్పక, తనకుతానే కత్తి చేతబుచ్చుకుని, పండులో కుళ్లినభాగము మనము తీసివేయునట్లే, కుక్కపండ్లు తగిలినంతమట్టుకు చుట్టును, సునాయాసముగా చరచరకోసి పారవైచి మందుపెట్టుకొని, కట్లు కట్టుకొని గాయము మాన్పుకొనెను.

అతడు తనకు తెలియని సంగతు లెవ్వడెవరు చెప్పినను నేర్చుకొని, తనకు తెలిసినదంతయు నందఱకును చెప్పవలయునని యెప్పుడు నుత్సాహపడుచుండెడివాడు. మరియు తనకు తెలియవచ్చిన శాస్త్రాంశములు సమయము వచ్చినపుడు సరిగా ఉపయోగమునకు తెచ్చుకొని తాను సంకల్పించిన కార్యము నెరవేర్చుకొనుచుండెను ఇందుకు రెండు ఉదాహరణములు:

౧. ఒకనాడొక చిన్నబాలు డీతని చేరవచ్చి "అయ్యా! పేపబెత్తపు ముక్కలు మథించగా వేడిపుట్టి వెలుగగుపడెను. ఇట్లగుటకు

కారణ మేమి? అని యడిగెను. ఆ సంగతి డేవీ కంతవఱకు తెలియదు. అది విని డేవీ "అలాగునవా? అనుచు తత్క్షణమే రెండు బెత్తపు ముక్కలు తెప్పించి మథించి చూచి బాలుడు చెప్పినది నిజమే నని తెలుసుకొనెను. పిమ్మట పేమును సూక్ష్మముగా పరిశీలించి చూడగా దానిపై పొరమీద నిసుకతో గూడిన గఱుకుతొక్క యేర్పడియున్నట్లు స్పష్టమయ్యెను. ఇట్టి గఱుకుతొక్కల రాపిడి చేత తేజ ఉష్ణము లిందు సులభముగా పుట్టు చున్నవని యతడు గ్రహించెను. తరువాత బహుకాలమునకు ఒకప్పుడు ఐర్లండు దేశము లో రయితులయెదుట వ్యవసాయరసాయన శాస్త్రములకు గల సంబంధమునుగూర్చి యుప న్యాసము లిచ్చునపు డీ యంశమునుగూర్చి చాలవఱకు చెప్పి, తన చిన్నతనములో నీ సంగతి యొకబాలునివలన తాను నేర్చుకొని నట్లుకూడ తెలిపెను.

౭. మరియొకప్పుడు 'డంకిన్' అనునొక దొరతో డేవీకి గట్టిగా వాదము పొసగెను. వా రుభయులు ఉష్ణధర్మములనుగూర్చి వాద ప్రతివాదములు సలుపుచుండిరి. రాపిడిచేత మంచుగడ్డలలోనయినను వేడిపుట్టునని డేవీ వా దించెను. "ఏడిసినట్లే యున్నది. మంచుగడ్డలో వేడి పుట్టునా! నీ మొగము! నీకేమి తెలుసును" అని డంకిన్ ఖండించుచు తూలనాడెను. అయి నను మథించుటవలన ఉష్ణ ముదయించుటలో నాశ్చర్యమేమని డేవీ ప్రశ్నింపగా, "ఒరే" అబ్బాయి! నీకుతోచదు. మావంటివారు చెప్పినను వినవు. నీవుబట్టిన కుందేటికి మూడే కాళ్లను మూర్ఖుడవు. నీతో మాటలేల?" అని నిరసించెను. మాటలేల? క్రియకే చూతము రమ్మని డేవీ తన ప్రతిపక్షిని సమీపనదీతీర మునకు తీసుకొనివెళ్లి నదిలోని మంచుగడ్డలు రెండుతెచ్చి గట్టిగా మథించెను. అందువలన వేడిపుట్టి మంచుగడ్డలు రెండును లోపలిభాగ మున కరగెను. మథించుట మానినతరువాత వేడిలేక, మంచుగడ్డలు కఱగుట మాని రెం డును ఏకమై ఒక్కటే గడ్డయయ్యెను. ఈక్రియ యిట్లు చేసిచూపి డేవీ ప్రతిపక్షి నోరడచెను. తరువాత చాలకాలమునకు లండనులో తగు మనుష్యుల యెదుట ప్రకృతి వైచిత్ర్యములను గూర్చి యుపన్యసించుచు డేవీ యీప్రయోగ మునే విశేషార్భాటముతో చూపగా సభికు లద్భుతరసమగ్నులయిరి.

౧౭౯౮ సంవత్సరములో నసగా నిరువది సంవత్సరముల ప్రాయమపు డితనికి మంచియు ద్యోగము లభించినది. ఇంగ్లండు దేశములో క్లిప్టను నగరమున డాక్టరు బెడ్డోసు అను నాతడు పెద్ద వైద్యశాల కట్టించి, శస్త్రచికి త్సాదులలో తనకు సాయముగావలసి, తగు వేతన మిచ్చి యీపిన్నవానిని తనకార్యా లయమునకు రమ్మనెను; ఈయుద్యోగము స్వీకరించుటకు బయలుదేరుచు నితడు భగవం తు నిట్లు ప్రార్థించెను. "దేవా! నావంశమా గొప్పదికాదు. నాకు ధనమూలేదు. అధికార మూ శూన్యము. అయినను ఇట్టిలోపములవలన నే జేయదలచిన శాస్త్రజ్ఞానాభివృద్ధికిని,మానవ

సేవకునుమాత్రము లోపము రాకుండున ట్లను గ్రహింపుము" అని యిట్లు సవినయముగా లోకేశ్వరుని ధ్యానించి, పెద్దల యాశీర్వచనములబొంది మహోత్సాహముతో డేవీ యిల్లు వెడలెను.ఉద్యోగలాభ మటుండ యితని కిపుడు చదువుకొనుటకు కావలసినన్ని పుస్తకములు, గొప్పగొప్పవారితో పరిచయము ననులాభములు మరిరెండు కలిగినవి. కొంతకాల మీయుద్యోగములో నుండినతరువాత నితడు తాను చేసిన రాసాయనికప్రయోగములను గూర్చియు, పదార్థతత్త్వవిషయములను గూర్చియు నొక చక్కనిగ్రంథము వ్రాసి ప్రకటించెను. ఈ గ్రంథప్రకటనమువలనను, వారిగొప్ప సిఫార్సులవలనను రాజసంస్థాపిత మగు శాస్త్రపాఠశాల (Royal College of Science) లో నితనికి సహోపాధ్యాయపదవి లభించినది. ఆ వెంటనే యీతని తెలివితేట లింకను పరిమళింపదొడగినవి. వింతవింత ప్రయోగము లకుతోడు సహజముగా రసవంతమగు వాక్చమత్కారము గలవాడగుటచేత నాతడు శ్రోతల మనస్సులను పూర్ణముగా రంజింపజేసి వారలను విస్మయానందములయం దోలలాడించుచుండెను. మరి కొలదికాలముననే ఇతనికి ప్రధానోపాధ్యాయపదవికూడ లభించినది.

ఇక గావలసిన దేమున్నది? ఇనుమడించిన యుత్సాహముతో నితడు క్రొత్త పరిశోధనలు చేయదొడగెను. ప్రశస్తములైన విద్యుద్ఘటమాల లతనిచేతులలో నున్నవి. కనుక ముందుగా క్షారలవణములను నీటిలో విలీనము గావించి బలమైన విద్యుత్ప్రవాహముచేత నా ద్రావణములను భేదించిచూడగా క్రొత్త ధాతువు లిట్టె బయల్పడజొచ్చెను. ౧. పొటాసియము, ౨. సోడియము, 3. మెగ్నీసియము ౪. కాల్సియము, ౫. స్ట్రాన్షియము, ౬. బేరియము అను నీయారు క్షారధాతువులను వేర్వేర ప్రత్యేకించి ఇతడు రసాయనశాస్త్రమునకు ముఖ్యము లయిన నూతనాధ్యాయములను చేర్చగలిగెను. ఇందు గొన్నింటి విశేషముల నిచట సంగ్రహముగా వ్రాయుచున్నాను.

౧. పొటాసియము:—ఇది వెండివలె ధవళమయినది. మైనమువలె మెత్తనిది. గాలి తగిలినంతనే అందలి వాయుసంపర్కముచే ధావళ్యము గోల్పోవును. చిన్నముక్క చన్నీళ్లలో బడవైచినను తత్క్షణమే వర్తులాకార సుందరమై చిటపటమనుచు జిఱ్ఱున దిరుగుచు నేరెడుపండుఛాయగల జ్వాలతో మండిపడుచు నీటిని రాసాయనికముగ భేదించి హైడ్రోజను వాయువు నవలదోలివైచి బలమైనక్షారముగా నేర్పడును. కనుకనే దీనిని నీసాలలో చమురులో ముంచియుంతురు. ఈ లోహము అగ్గిరామునివంటిది.

౨. సోడియము:—ఇదిగూడ పొటాసియమువంటిదేగాని అంతశక్తిసుంతమయినది గాదు. చన్నీటి నంతగా భేదించజాలదు. వేడినీటిలో చిన్నముక్క బడవైచినపుడు వర్తులాకారసుందరమై పదియారవన్నె బంగారు ఛాయతో భగ్గున మండుచు నేత్రోత్సవము చేయుచుం

డును. ఇదికూడ సీసాలలో చమురులో నుండ వలసినదే.

3. మెగ్నీసియము:—ఇది సోడియము కంటెను శక్తిహీనమయినది. తెల్లగ, మెత్తగ నుండు నీలోహము ముట్టించినపుడు కనులు మిరుమిట్లుగొనునంతటి యద్భుత తేజస్సుతో మండును. మనదేశములో దీపావళి అమావాస్యనాడు మన బాలబాలికలు కాల్చి వినోదించు గాఱడీ తీగె యీ మెగ్నీసియమే. పచ్చమతాబాలలో దీనిగుండ కలుపుదురు.

౪. కాల్సియము:—ఇది సున్నము, సుద్దముగ్గు లోనగు పదార్థములలో నున్న ధాతువు. దీనిసంపర్కముగలిగిన జ్వాల, ఎఱ్ఱగా ననగా కాల్చిన యిటుకల ఎఱుపు గలిగియుండును.

౫. స్ట్రాన్షియము:—ఇది పగడమువలె నుండును. ఎఱ్ఱమతాబాలలో దీనినికలుపుదురు.

౬. బేరియము:—ఈవర్గము లోహము లన్నిటిలో నిదిస్తబ్ధు. ఈధాతువు తగిలిన జ్వాల ఆకుపచ్చ వర్ణము గలిగియుండును.

పిమ్మట విద్యుచ్ఛక్తిచేత నితడు హైడ్రక్లోరికామ్లమును (Hydro Chloric Acid) భేదించగా పసుపువలె పచ్చగానున్న 'క్లోరిన్' అను క్రొత్తవాయు వొకటి పొడచూపెను. ఈ క్లోరిన్ వాయువుతో పైని వర్ణింపబడిన సోడియముధాతువు సమ్మేళనమైనపుడు ఉప్పుపుట్టుచున్నది. ఇదే మన "రుచులకు రస"మైనఉప్పు.

ఇట్టి చిత్రవిచిత్రవిషయములు గనిపెట్టి తెలుపుచుగా నితడు ప్రకటించుచుండుటచేతి నాకాలపు రాసాయనికులలో గొప్ప గందరగోళము పుట్టెను. "వీడెవడోగాని అసాధ్యుడు బయలుదేరి మాశాస్త్రమును తలక్రిందుచేయుచున్నా" డని వారితని దిట్టుచుండిరి.

డేవీ మంచివక్త. సమయస్ఫూర్తి గలవాడు. ప్రజాహితరతుడు. తనకు తెలిసిన శాస్త్రాంశములన్నియు తోడిమానవుల కందఱకును తెలియజెప్పవలయు నను నుత్సాహము కలవాడు. కనుక నందఱకును చక్కగా తెలియునట్లు శాస్త్రవిషయములను గురించి తేటమాటలతో నుపన్యాసము లిచ్చుచు చెప్పిన దంతయు వినువారి మనస్సులకు పట్టునట్లు వారియెదుటనే ప్రత్యక్షముగా ప్రయోగములు చేసిచూపుచు నాబాలగోపాలమును విస్మయానందములచే మైమఱచునట్లు చేయుగల్గుచుండెను. జనసామాన్యమునకు జ్యోతిషవిషయములు ఫెర్గుసన్ పండితుడును, పదార్థవిజ్ఞానరసాయనశాస్త్రవిషయములు డేవీయును, తేటతెల్లముగా నుపన్యసించుచు, ప్రశంసాపాత్రమగు సేవచేసిరి. ఫెర్గుసన్ పండితుని యనంతరము హెర్షిల్ జ్యోతిశ్శాస్త్రమును విస్తరింపజేసినట్లు, డేవీ యనంతర మతని శిష్యుడగు మైకేల్ ఫేరడే ఈశాస్త్రజ్ఞానము నింకను వృద్ధిచేసి నేటి నాగరకజీవనమునకు ప్రాణపదములనదగు విద్యుద్యంత్రసమితి నెట్లు స్థాపింపగల్గెనో ఫేరడే జీవితచరిత్రలో వర్ణింతుము.

డేవీద్వార కీర్తి ఐర్లండుదేశమునకు వ్యాపించెను. అచటి రయితులందరును చందాలు

డును. ఇదికూడ సీసాలలో చమురులో నుండ వలసినదే.

3. మెగ్నీసియము:—ఇది సోడియము కంటెను శక్తిహీనమయినది. తెల్లగ, మెత్తగ నుండు నీలోహము ముట్టించినపుడు కనులు మిరుమిట్లుగొనునంతటి యద్భుత తేజస్సుతో మండును. మన దేశములో దీపావళి అమావాస్యనాడు మన బాలబాలికలు కాల్చి వినోదించు గాఁడీ తీగ యీ మెగ్నీసియమే. పచ్చ మతాబాలలో దీనిగుండ కలుపుదురు.

౪. కాల్సియము:—ఇది సున్నము, సుద్ద ముగ్గు లోనగు పదార్థములలో నున్న ధాతువు. దీనిసంపర్కముగలిగిన జ్వాల, ఎఱ్ఱగా నసగా కాల్చిన యిటుకల ఎఱుపు గలిగియుండును.

౫. స్ట్రాన్షియము:—ఇది పగడమువలె నుండును. ఎఱ్ఱమతాబాలలో దీనినికలుపుదురు.

౬ బేరియము:—ఈవర్గము లోహము లన్నిటిలో నిది స్తబ్ధము. ఈధాతువు తగిలిన జ్వాల ఆకుపచ్చ వర్ణము గలిగియుండును.

పిమ్మట విద్యుచ్ఛక్తిచేత నితడు హైడ్రక్లోరికామ్లమును (Hydro Chloric Acid) భేదించగా పసుపువలె పచ్చగానున్న 'క్లోరిన్' అను క్రొత్తవాయు వొకటి ప్రొడచూపెను. ఈ క్లోరిన్ వాయువుతో పైని వర్ణింపబడిన సోడియముధాతువు సమ్మేళనమైనపుడు ఉప్పుపుట్టుచున్నది. ఇదే మన "రుచులకు పస"యైనఉప్పు.

ఇట్టి చిత్రవిచిత్రవిషయములు గనిపెట్టి తెలుపుచుగా నితడు ప్రకటించుచుండుటచేత నాకాలపు రాసాయనికులలో గొప్ప గందరగోళము పుట్టెను. "వీడెవడోగాని అసాధ్యుడు బయలుదేరి మా శాస్త్రమును తలక్రిందుచేయుచున్నా" డని వారీతని దిట్టుచుండిరి.

డేవీ మంచివక్త. సమయస్ఫూర్తి గలవాడు. ప్రజాహితరతుడు. తనకు తెలిసిన శాస్త్రాంశములన్నియు తోడిమానవుల కందఱకును తెలియజెప్పవలయు నను నుత్సాహము కలవాడు. కనుక నందఱకును చక్కగా తెలియునట్లు శాస్త్రవిషయములను గురించి తేటమాటలతో నుపన్యాసము లిచ్చుచు చెప్పిన దంతయు వినువారి మనస్సులకు పట్టునట్లు వారియెదుటనే ప్రత్యక్షముగా ప్రయోగములు చేసిచూపుచు నాబాలగోపాలమును విస్మయానందములచే మైమఱచునట్లు చేయుగల్గుచుండెను. జనసామాన్యమునకు జ్యోతిషవిషయములు ఫెర్గుసన్ పండితుడును, పదార్థవిజ్ఞానరసాయనశాస్త్రవిషయములు డేవీయును, తేటతెల్లముగా నుపన్యసించుచు, ప్రశంసాపాత్రమగు సేవచేసిరి. ఫెర్గుసన్ పండితుని యనంతరము హెర్షిల్ జ్యోతిశ్శాస్త్రమును విస్తరింపజేసినట్లు, డేవీ యనంతర మతని శిష్యుడగు మైకేల్ ఫేరడే ఈశాస్త్రజ్ఞానము నింకను వృద్ధిచేసి నేటి నాగరకజీవనమునకు ప్రాణపదము లనదగు విద్యుద్యంత్రసమితి నెట్లు స్థాపింపగల్గెనో ఫేరడే జీవితచరిత్రలో వర్ణింతుము.

డేవీద్వార కీర్తి ఐర్లండు దేశమునకు వ్యాపించెను. అచటి రయితులందరును చందాలు

యుండును. కాని దేశబాంధవుడును, ప్రజాహితరతుడును నగు నీ మహాపురుషునకు ధనరాసులే జీవితాశయము కాదు గనుక పేటెంటు చేయించ లేదు. 'మీ సేవయే నాసంతోషము'ని యత డుదారబుద్ధితో వదిలిపెట్టెను.

విద్యుత్ప్రవాహముచేత దీపములు వెలిగించుకోవచ్చునని ఇతడే మొట్టమొదట లోకమునకు నిరూపించినాడు. 'మర్డల్ 'చేత కల్పించిన గాస్‌దీపములకు డేవీకల్పితములైన విద్యుద్దీపములు ప్రబలప్రతిస్పర్థులై యున్నవి. ప్రపంచరంగమం దీరెంటికిని జరుగుచున్న పోటీలో విద్యుద్దీపములకే జయ మెక్కువ గల్గుచున్నట్లగుపడుచున్నది.

పిమ్మటకూడ నితడు రాజసన్మానమును విశేషముగా పొంది 'బారొనెట్' బిరుదము గూడ బడసెను. రాయల్ సొసయిటీ (Royal Society) కి అధ్యక్షు డయ్యెను. రసాయన, విద్యుత్, కాంతిశక్తులనుగురించి యావజ్జీవము నేతో పరిశోధనలు చేయుచునేయుండి, ౧౮౨౯ సంవత్సరము మేనెల ౨౯ వ తేదీని స్విట్జర్లండు దేశములోని జెనీవా నగరమున నితడు కాలధర్మము నొందెను.

---

## స్వామి!

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ

పరిగాఢశర్వరీచ్ఛవి దరిద్ర
 తానిధానము, తేజోవిహీన, మనవ
రతపరిస్రుత బాష్పధారామిళితము
నన్ను నీవుండుమన్నంగణంబు తండ్రి!

ఈ మహాంధకారంబున నెపుడొ ఒక్క
సారి మెఱసితి వానాడు స్వామి! నా కు
టీర మానందవాయుప్రచారశతన
హాసకుసుమపరీమళవ్యాప్తతంబు.

దానితోసరి! మరల నాంధ్యంబు క్రమ్మె
తొలి చివురులేని యీచీకటులును నేను
నొక్కరొక రప్పళించుకొం చుండినాము
నిన్ను నీనాటిమెఱుపు మన్నించుకొంచు.

---

